సంపుటము 1] సెప్టెంబరు 1917 [సంచిక 3

# బాలమిత్ర



## పిల్లల పాట

ఆటలాడుదమా చెం - డాట లాడుదమా =
వాటమైన త్రొక్కుడు బి - ళ్లాట లాడుదమా

1. చెట్టులెక్కుదమా లేక - గుట్టలెక్కుదమా =
అట్టునిట్టు జీరుగుబండ - లందు జారుదమా || ఆట ||
2. కూతలెట్టుచు దాగిలి - మూతలాడుదమా =
ఆ తెరువుక్రింద గోలీ - లాట లాడుదమా || ఆట ||
3. కొమ్మలెక్కుదమా కోతి - యాట లాడుదమా =
ఈతగొట్టుచు నదులయందు - స్నాతులాడదమా || ఆట ||
4. చెలిగుడాడుదమా - చెలికాండ్ర బిలుతమా =
బలిగుడాడుచు నేలపైని - బంతు లాడుదమా || ఆట ||

---

## ప్రార్థన బలము

ఇంగ్లండు దేశమున నొకయూర నొక విధవరాలును యామె బిడ్డ లిరువురును వసించుచుండిరి. వారి గృహము

కడమయిండ్లకడగాక వేరుగ నుండెను. వారు భాగ్యవంతులు గానందున ఆడుపిల్ల లిద్దరును కుట్టుపనిచేసి సంపాదించుసొమ్మే వారిరాబడియై యుండెను. మరియు వా రెప్పుడును పని చేయుచు నుండువారు. ఇట్లుండ నొకనాడు పెద్దతుఫానుగలిగి, చలిదేశముల సాధారణముగ పడుచుండు మంచు భూమిని కప్పివేయసాగెను. అట్టి సమయమున బాటలుగాని ఇతర దూర వస్తువులు గాని సరిగ గనబడవు కావున తమ భోజనము విషయమై పై పిల్లలిద్దరును భయపడసాగిరి. మంచులో బడి బజారునకు వెళ్లి సరకులగొని దెచ్చువారెవరును వారి ఇంటిలో లేనందునను, 'వారియొద్దనుండిన కొంచెము పిండియు త్వరలో ముగియునని తెలిసినందువలనను, ఆ కన్య లిరువురు దిగులుపడసాగిరి. అయితే వారితల్లి "భయపడకుడు. ప్రభువు సహాయపడును" అని ధైర్యముతో నుండెను. ఆమె దేవుని ప్రేమించువారిలో నొకతె. విశ్వాసమున్నందున నామె అధైర్య పడక నిరీక్షణ గలిగియుండెను. అసహాయుల నాయన విడువడని ఆమె ఎరిగియుండెను. సాయంత్రమయ్యెనుగాని మంచు పడుట నిలువలేదు. రాత్రియయ్యె. పిండికూడ అంతమొందెను. పిల్లలిద్దరు తమ తల్లిమాటల నమ్మజాలక దుఃఖముఖులై కూర్చుండి కుట్టుచుండిరి. ఉదయమున నేమి తినవలయునని వారు తలచుచుండిరి. మరియు రాత్రి సమయములో నెవరు తమ కాహారము గొనితెత్తురని వారు తత్తరపడిరి. వారిజనని

మాత్రము ఓపికతో కనిపెట్టియుండె. వీరిట్లుండ, ఆ యూర నున్న యొక కాపువాడు భోజనముచేయ గూర్చుండియుండి వీరిని తలంచుట తటస్థించెను. అతనికొక కొమరిత తక్క నింకెవ్వరు లేరుగాన అన్నవస్త్రాదు లతనికి దక్కువలేకుండెను. భోజనముచేయ నితడు కూర్చుండెను గాని దూరమున నివసించుచుండిన యీ పేదవారి మీదికే ఇతనిధ్యానముపోయెను. తక్షణమే అతడు తన కుమార్తెను బిలచి "నేను ఇప్పుడే వెళ్లి మన సోదరియగు నా విధవరాలిని దర్శింపవలెను. మరియు వారికొరకై కొంచెము పిండియు కట్టెలనుగూడ దీసికొని పోదును కావున వాని సిద్ధపరచుము" అనియె. ఆమె వాని సిద్ధపరచగా నతడు తన మోటబండిపై వాని వేసికొని, యెంతో కష్టముతో నా పేదవిధవరాలియిల్లు జేరెను. వెళ్లి తలుపుతట్టుటతోనే నా యింటనున్న భక్తురాలు ప్రభువు తనకు సాయమునంపెనని గ్రహించి ఆయనకు వందనములు చెల్లించెను. పిల్లలిరువురు తలుపుదెరచి చూడ దయార్ద్ర హృదయుడగు నా వృద్ధుడు కనబడెను. అతడు వారి తల్లిని జూచి, "ప్రియసోదరీ! నేడు నీ ఇంటికి వెళ్లిరమ్మని ప్రభువు నాకాజ్ఞాపించెను. ఆయనమాట నెరవేర్చువరకు నాకు నెమ్మది లేకుండెను. మీకందరికి క్షేమమేగదా?" యని కుశల ప్రశ్నలడిగి, తాను దెచ్చియుండిన వస్తువుల వారి కిచ్చివేసెను. అప్పుడా తల్లి కన్నులనుండి కృతజ్ఞతతో కూడిన సంతోష

బాష్పములు రాలెను. పిల్లలిద్దరు తమ అపనమ్మిక నిమిత్తమై సిగ్గునొంది మరెన్నడు ప్రభువు వాగ్దత్తముల విషయమై అనుమాన మొందలేదు. ఆయనయందు నమ్మిక యుంచువారి నాయన కష్టకాలమున విడుపడనుట సత్యమైయున్నది.

---

## స్తంభముపైని మనుష్యుడు

ఒక యూరిలో కొందరొక మేడను కట్టుచుండిరి. దానిలో నొక స్తంభము చాల ఎత్తున కట్టవలసి వచ్చెను. అక్కడికి మనుష్యులు ఒక త్రాటి సహాయమున ఎక్కుచు దిగుచు పోవుచుండిరి. దానికట్టు ముగించిన పిమ్మట నొకరు తప్ప అందరు త్రాటి సాయమున దిగివచ్చిరి. వెంటనే త్రాడు లాగి వేసిరి కావున నతడు క్రిందికిరా నసాధ్యమాయెను. అందరు నతనిచూచి దిగులుపడిరి. ఆ ఎత్తు స్థలమున కెవరును వెళ్లజాలరు. అతడు క్రిందికి దుమికిన చనిపోవును. అక్కడనే చలిలో అన్నపానాదులు లేక చావవలసివచ్చె గదా యని అందరు చింతింపదొడగిరి. పైనున్నవాని మతిపోయినట్లుండెను. అతడు క్రిందికి దుముక నుద్యుక్తుడయ్యెను. అంతలో నతని భార్యయా స్థలమునకేగి అతని పిలిచి "కాలినున్న మేజోడును విప్పి దాని చివర నొక చిన్నరాతినికట్టి నింపాదిగా క్రిందికి విడువుము" అని యఱచెను. అతడాబుద్ధిమంతురాలు చెప్పినట్లు



చేసి తనకాలి మేజోడు సన్నని దారమును క్రిందికి విడచెను. ఆ మేజోడామెయే తల్గియుండెను. రాయి కనుబడుటతోడనే దాని విప్పివేసి యాం చివర నొక సన్నని సైల్కు దారమును కట్టి పైన నున్నవాని నా దారమును భద్రముగా లాగుకొనుమని చెప్పెను. అందరు నీమె సాహసకార్యమును వింతగా

చూచుచుండిరి. దారము నతడు అందుకొనినట్లు తెలియగానే దాని చివర నొక త్రాటిని కట్టి విడచెను. అతడా త్రాటిని లాగుకొనెను. ఈ విధముగ ననేకసార్లు లాగి సంపాదించిన త్రాటిని అతడు ఆ పైనున్న స్తంభమునకు గట్టిగ కట్టివైచి దాని సాయముననే క్రిందికి దిగివచ్చెను. అక్కడనున్న వారందరు నా స్త్రీయొక్క సూక్ష్మబుద్ధి కాశ్చర్యపడుచు నామె ధైర్య సాహసములకు వేనోళ్ల నామెను స్తుతియించిరి. కష్టసమయమున నధైర్యపడక ప్రభువుపై తమభారమంతయు వైచి ప్రార్థనతో తన పనిని చేయువారే బుద్ధిమంతులు.

---

# బొబ్బల రోగము

ఈ జబ్బు తగిలినవారు ఇంటిలోని పెద్దగదిలో బాగుగా గాలివచ్చు స్థలమున తీరుబడిగా పరుండవలెను. వర్షములేనియెడల బైటనీడలో పరుండుటమేలు.

2. ద్రవరూపమైన భోజనము చేయవలెను.

3. దప్పికయినప్పుడు మంచి చల్లనినీటిని త్రాగవలెను. అట్టివానికి దాహమియ్యకుండుట బహు క్రూరమైనపని.

4. రెండుగంటల కొకమారు టించర్ అయొడీన్ ఒక బొట్టును అరఔన్సు నీళ్లలోకలిపి త్రాగవలెను.

5. బొబ్బలకు ప్రతిదినము టించర్ అయొడీడ్ పూయ వలెను. మరి యే అవుషధమును వాడకూడదు.

ప్లేగు విషయముచూచు ప్రతి ఆఫీసరుయొద్దగాని, ఔషధ శాలలోగాని ఉచితముగా ఈమందు దొరకును.

---

## చెట్ల జీవితకాలము

ఇంగ్లండులో నొక చెట్టుకు 2,000 సం॥ ల ప్రాయమట. మరి యొకదానికి 3,000 సంవత్సరములని చెప్పెదరు.



సీడరనునది 2,000 సంవత్సరములు బ్రదుకునట. ఓకు వృక్షము 1,500 ఏండ్లు బ్రతుకును. ఓలీవవృక్షము 800 ఏండ్లు జీవించును. అమెరికాలోని కొన్ని చెట్లబోదెలను బట్టిచూడగా

4,000 సంవత్సరములు జీవించినవియు గలవట. వానిలో కొన్ని అబ్రహాము కానానులో దిరుగునప్పుడు పుట్టియుండును.

---

## సౌఖ్యముగా నుండుటెట్లు?

ఒక దేశములో ఒక రాజు గలడు. ఆయన తన ప్రజలందరు సౌఖ్యవంతులైయుండ గోరెను. ఇదెట్లు సాధ్యమగునని తన మంత్రులలో మిగుల జ్ఞానవంతులగు ఇద్దరినడిగి, రెండునెలలైన తరువాత చెప్పవలెనని గడువు పెట్టెను. ఆ గడువుదాటినపిమ్మట వారిద్దరు రాజుదగ్గరకు వచ్చిరి. ఒకనిచేతిలో ఒక పెద్దకాగిత ముండెను. దానిపై రెండువందల పద్ధతులు వ్రాయబడెను. వాటిప్రకారము ప్రతిదినము రాజుగారు చేయువలసి యున్నదని వాడు తెలిపెను. ఆ రెండువందల పద్ధతులను వినునప్పటికే రాజుగారికి విసుకుపుట్టెను. వాటిప్రకారము చేయు టట్లుంచి వాటిలో సగమైనను జ్ఞప్తియుంచుకొనగలనా యని రాజు చింతపడ నారంభించెను. అంతట రెండవవానివంక దిరిగి, నీ వేమందువని యడిగెను? అందుకు వాడు "దేవుని ప్రేమింపుము" అని రెండుమాటలుమాత్రము జెప్పెను. "ఇదేమిటి? నా ప్రజల నెట్లు సౌఖ్యవంతులనుగా జేయవచ్చునని యడిగితే, దేవుని ప్రేమింపుమని చెప్పెదవేమిటి?" అని రాజనెను. "నే

నన్నమాట నిజమే. నీ జనులను ప్రేమింపకుండ దేవుని ప్రేమించలేవు. వారిని ప్రేమించుటే వారినిసౌఖ్యపరులనుగా జేయుట" అని జవాబిచ్చెను.

---

## సత్య సంధత

మనోహరమగు తోటలో విహరించుటెంత దివ్యము! అది బహుజాగ్రతగా చూడబడుచున్నది. ఒక కలుపు మొక్కయినను లేదు. వికసించెడి పుష్పాలతోను, పక్వమగు చున్న ఫలములతోనునిండి, మనస్సునకు హాయిగూర్చుచు, కన్నుల కానందము కలిగించుచున్నవి.

మన హృదయములు నిట్టి సౌందర్యారాములై యుండవలెను. వానిలోని తప్పితముల పెరికివేయుట మాత్రమే గాదు, గాని వానిలో సత్యసంధత, పట్టుదల, ధైర్యము ఇత్యాది సుగుణఫల సమూహములు బెరుగునట్లు చేయవలెను.

మొదట సత్యసంధతనుగూర్చి విచారింతము.

ఇదెట్లు కనుపడును? సత్యసంధుడైన వాడెవరినైనను, మాటచేగాని, చూపుచేగాని, క్రియచేగాని మోసపుచ్చడు. తన పొరుగువానిని తనవలెనే చూచుకొనును. వానివిషయ మెన్నడును అబద్ధములు కల్పించడు. ఎంతనష్టము కలిగినను ఆడినమాట తప్పడు, త్వరపడి ప్రమాణముచేయక, చేసిన

దానిని తప్పక నెరవేర్చును. మన రాజుగారి సత్యసంధతను గూర్చి ఈ దిగువసంగతి దెలిపెదరు. ఆయన తన చిన్న తనములో, దినమున కొక యధ్యాయమును బైబిలునుండి చదివెదనని తన తల్లిగారికి వాగ్దానముచేసెను. దాని నింత వరకు ఆయన నిలుపుకొనియున్నాడు, ప్రస్తుత మింగ్లీషు జనాంగమును, చాలకాలము క్రిందట బెల్జియము దేశీయు లకు కష్టకాలమున సహాయము చేతుమను వాగ్దానముకొఱకే ఈ భయంకర యుద్ధమునందు పోరాడుచున్నారు. అనేక సంవత్సరముల క్రిందట జీవించిన యొక మహానుభావుడు, దేవుని కిష్టుడగు మనుష్యుడు, తన హృదయమునుండి సత్య మునే రానిచ్చుచు, నష్టము కలిగినను తన పొరుగువాని కిచ్చిన మాటను తప్పకయుండునని తెలిపియున్నాడు.

సత్యసంధత అన్నిచోట్లను అవసరమే. ఒకని నొకడు నమ్ముకొనజాలనియెడల లోకమే నడవదు. చేతికి నోటికి దూరములేని వర్తకుడే వృద్ధికెక్కును. న్యాయసభలయం దును నిజము తేలనియెడల అపరాధులు తప్పించుకొందురు. జనసంఘమునకు కీడు వాటిల్లును. కుటుంబములలో నిది యెంతో యవసరము. సత్యవంతునిమాటను పిల్లలు లక్షిం తురు. వానియందు గౌరవముంతురు. అట్టి గృహములలో భర్తయగువాడు నెమ్మది ననుభవించును.

ఒకసారి ఒకడు చెవిటి మూగపిల్లవానిని "సత్యమనగా నేమి?" అని యడిగెను. వాఁ డొక పలకపట్టుకొని, తిన్నని గీతను గీసెను. "అబద్ధమన నేమి?" యను రెండవ ప్రశ్న కూడా వేయబడెను. ఈ మారతడు ఒక వంకరగీతను గీసెను. సత్యమనగా తిన్నగా ప్రవర్తించుటయును, అబద్ధమనగా వంకరమార్గమున నుండుటయునై యున్నది.

సత్యసంధత సులభముగా నలవడు సుగుణముగాదు. భయమువలన కొందర బద్ధమాడ ప్రేరితులగుదురు. తమ తప్పుల నొప్పుకొన్నయెడల శిక్షకలుగునను భయముతో, మన బిడ్డలు తప్పుచేసినప్పుడు అబద్ధమాడవచ్చును గాన వారి యెడల నెమ్మదిగా నుండవలెను.

సత్యసంధత దైవసంబంధమైనదై యున్నది. దేవుడు సత్యమై యున్నాడుగాన మనము సత్యమాడునప్పుడు దేవుని వలె యగుచున్నాము. ఆలాగైనయెడల మన మీ సుగుణము నెట్లు పెంచుకొనవలెను. ఓర్పుతో నభ్యసించుటవలన మాత్రమే యీలా గొనర్పగలము. ఒక గొప్ప యాంగ్లేయ గ్రంథకర్త నీరీతిగా వక్కాణించెను. "సత్యమాడుట వ్రాత వంటిది. వ్రాతవలె నదియు అభ్యాసమున వచ్చును. అది వాడుకవలన వచ్చునదై యున్నది. దినమంతయు మన పెదవుల విషయము జాగ్రత్తగానుండి ఎంతకొద్ది విషయముల గూర్చియైనను, నిజముతప్ప మరేదియు చెప్పకూడదు.

అప్పుడు శోధన కాలమున సత్యమాడుట సులభము. మనము దేవుని సన్నిధి నున్నామని మరువకూడదు. సత్యమైయున్న వాడు మన క్రియల చూచి మన మాటల లక్షించుచున్నాడు. ఆయన యెదుట నబద్ధముగా వర్తించుటకు భయపడవలదా? "ఓ ప్రభువా! నా నోటిని కాయుము—నా పెదవులద్వారము కాపాడుము" అని దినదినము ప్రార్థించుము. ఆయన దాని సంతోషముతో విని, తనవలెనే మనలను సత్యవంతులనుగా జేయును.

---

# ప్రకృతి పాఠములు

## 37 వ-పాఠము

### రక్తము చేయు పనులు

విద్యార్థులారా! ఇదివరకు రక్తమేలాగు కలుగుచున్నదో విని యుంటిరి, కాని ఈసారి రక్తముచేయు పనులు వివరింపబడుచున్నవి.

1. రక్తము మనయొక్క దేహమందలి ప్రతి యవయవమునకును పారుచు ఆయా అవయవములకుగల పదార్థములను ఇచ్చుచున్నది.

2. ఇదియునుగాక ఈ రక్తమే ఆయా అవయవములలోనుండెడి మలినపదార్థములను మరల మనయొక్క గుండెకు తీసికొనివచ్చుచున్నది.

3. మరియు నీ రక్తము ఆకారమునందు తెల్లగా నున్నది గాని దీనియందు ఆకారమందు రూపాయలుగాను, ఎర్రగా నుండు కొన్ని చిన్నవస్తువులు గలవు. ఇవియే ఆయా అవయవములకు కావలసినటువంటి పదార్థములను తీసికొని వెళ్లుచున్నది.

4. మరియు దీనియందు కూడా వెళ్లని పదార్థములు కలవు. ఇవ చేయుపని యేదనగా:—మనయొక్క రోడ్లను పాకీవాండ్రు శుభ్రముచేయుచున్నట్లు ఇవి మలినపదార్థములను కనుబడినట్టి వాటి నన్నిటిని తినుచుండును.

---

# బైబిలు పిల్లలు

## సంసోను

ప్రియ బాలమిత్రులారా! ఇశ్రాయేలీయుల న్యాయాధిపతులలో సంసోను అనువాడొకడు. అతడు చిన్ననాటినుంచి దేవునికి సమర్పింపబడెను. అతడు ద్రాక్షారసపానమును, క్షౌరమును, వెండ్రుకలను కత్తెరవేయించు



కొనుటను మానెను. సంసోను జనులలో మిక్కిలి బలాఢ్యుడు. ఇశ్రాయేలీయులు పెలిస్తీయులచేత బాధింపబడకుండా వారిని విడిపించుటకు తగినశక్తిని దేవుడు సంసోనుకు దయచేసెను. ఒకదినమందు సంసోను అడవిలోగుండా వెళ్లుచుండగా ఒక సింహము అతనిని చూచి గర్జించెను. సంసోను తనచేత కత్తియైనను, కర్రయైనను లేకపోయినను సింహముమీదికి పరుగెత్తుకొనిపోయి దానిని తునకలు తునకలుగా చీల్చివేసెను. పెలిస్తీయులు సంసోను బంధించుటకు యూదాదేశమునకు పోయిరి. యూదా జనులు తన్ను క్రొత్త త్రాళ్లతో కట్టి పెలిస్తీయులకు ఒప్పగించుటకు సంసోను ఒప్పుకొనెను. పెలిస్తీయులు సంసోనును చూడగానే గేలిగొట్టిరి. అయితే ఆ

బంధములను తెంచుకొనుటకు దేవు డతనికి సామర్థ్యము కలుగజేసెను. సంసోను తన సమీపమందు పడియున్న ఒక గాడిదె దవడ ఎముకచేత ఫెలిస్తీయులలో ఎనిమిదిమందిని సంహారించెను.

(సశేషము)

---

# బాలమిత్ర టపా

ప్రియ బాలమిత్రులారా!

నేను మూడు సంవత్సరములనుండి ప్రతినెల బాలమిత్రను చదువుచున్నందుకు నా మనసునకు చాల సంతోషము కలుగుచున్నది. అదియును గాక, కే. మార్థ మిసమ్మ గారును, జె. సుబ్బమ్మయును, ప్రతి బుధవారము వచ్చి మాకు దేవునియొక్క మాటలు చెప్పుచు మా మనసులను చాల తృప్తిపరచేవారు. ఆ మిసమ్మగారు మార్చినెలలో తమ స్వదేశము వెళ్లినారు. ఇప్పుడు సి. బి. ఎలియట్ మిసమ్మగారును, బి. అంకమ్మయును, ప్రతి ఆదివారము $7\frac{1}{2}$ గంట మొదలు 9 గంటలవరకు మా పోష్టువీధిలో ఒక చిన్న సండేస్కూలు పెట్టినారు. మేము అందరము 40 మంది హిందూ పిల్లలము. దేవుని ప్రేమను, ఆయన మహిమనుగురించి మేము శ్రద్ధతో వింటూ ఆ కథలను, కీర్తనలను కంఠత అప్పచెప్పుచు ప్రార్థన




ప్రతిదినము చేయుచున్నాము. ఈ దివ్యమైన దేవునియొక్క మహిమగల మాటలు ప్రతి ఆదివారము వీరిద్వార వినిపించబడినందుకు ఈ చిన్నస్కూలు సంగతి మీకు అందరికి తెలియపరచినందుకు దేవునికి అనేక స్తోత్రవందనములు నిత్యము చెల్లించుచు యున్నాను. బాలమిత్ర సంపాదకురాలైన శ్రీ అమ్మగారికి అనేక ప్రేమసలాములు.

బాలమిత్రను చదువు బాల బాలికలారా! మనమందరమును గూడి మనలను రక్షించెడి ప్రభువుయందు భక్తి విశ్వాసములుంచి ఆయనను నిత్యము ప్రార్థిస్తూయుండడము నా కోరిక.

ఇట్లు తమ బాలమిత్రురాలు
చిక్కాల అప్పల నరసమ్మ,
బొబ్బిలి

C. L. S. PRESS, MADRAS—1917